Ithihasaparisodhakamala 14

# COMMUNITY PROJECTS

- ★ " History in authentic fragments lay mingled with fabulous chimeras, wherein also was reality."
- ★ "Big books are out of fashion."
- ★ I many a time say, the writers of Newspapers, pamphlets, poems, books, these are the real working effective church, of a modern country."

—*Thomas Carlyle.*

- ★ Politics is not in my line : I have always confined myself to doing my little best to make men less foolish and more honorable."

—*Voltaire*

By

KODALI LAKSHMINARAYANA B. A.,

Bharat Sevak Samaj
*President :*
JAWAHARLAL NEHRU

*National Head Quarters*
NEW DELHI,
*Oct 24, 1952*

*Dear friend,*

I thank you for your letter dated 14th October, 1952, addressed to Shri Jawaharlal Nehru.

I am happy to note that you have a genius for writing work. We shall certainly contact you as and when we need your services. In the meanwhile you can forward your articles on Community projects etc. to this office, if you so desire.

*Shri*
K. L. NARAYANA *B. A.*,
MOPARRU
(*Via*) TENALI

*Yours in service*
(Sd ) M. L. VARMA
*Administration Secretary.*

---

## Opinion on :

PRACHINA BHRATIYA PRAJASWAMIKAMULU

By K. LAKSHMINARAYANA

"In this booklet, the author traces the growth of democracy in Ancient India and points out the essential differences between old world democracy and that of the present day. Democracy practised in Greece and the Prajatantra States (the small republics) mentioned in the Buddhistic literature are vividly described and their chief characteristics are indicated. Mention also is made of the Republican States which existed after Buddha's *nirvana*. Democracy is thus not new to India."

(THE HINDU 25—3—1956)

# తొలిపలుకు

1952 లో నీ పుస్తకమును ఇంగ్లీషులో రచించితిని. ఇందలి కొంత భాగమును నెహ్రూగారికి పుట్టిన దినము కానుకగా పంపితిని. వారిప్పుడు పై జవాబును పంపించిరి. అప్పటినుండి కార్యభారముచే గ్రంథమును ముద్రించజాలక పోతిని. నేటికి పున్నెము గల్గినది. తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురము తాలూకా, పామర్రు గ్రామ వాస్తవ్యులు, అముజూరు వాస్తవ్యులు, ముఖ్యముగా శ్రీ కోడూరి సూర్యారావుగారి యొక్క, తెనాలి వాస్తవ్యులు శ్రీ ముమ్మనేని చలపతిరావుగారి యొక్క ప్రోత్సాహమున, నీ పుస్తకము నేడు బయటకు వచ్చినది. వీరి కెల్లరకు నా వందనములు.

గౌరవనీయులు వ్యవసాయ శాఖామాత్యులు శ్రీ కందుల ఓబులరెడ్డి గారు ఈ గ్రంథము నావిష్కరించుటచేత, బంగారుకు తావియబ్బినట్లయినది. వీరి కీర్తిచంద్రికలు చరిత్ర నిల్చునంత కాలము నిల్చుగాక! సర్వేశ్వరుడు పరమాత్మ, చిరకాలము ప్రజాసేవ చేయునట్లు, వీరి కాయురారోగ్య భాగ్యముల నొసంగుగాత యని వేడుచున్నాను.

మోపఱ్ఱు
1-6-1956

ఇట్లు
కొడాలి లక్ష్మీనారాయణ

# ప్రశంస

(శ్రీ కొడాలి లక్ష్మీనారాయణ గారికి ప్రేమతో)

తప్పుల నేరి ఆంధ్ర వసుధాతల మందు చరిత్రసత్యముల్
కుప్పలు బోసి తెల్గురమకున్ జిగిసూరిచి కోవిదాళిచే
మెప్పుల నందినావు తగమే ? కనుసన్నల తెల్గువారిచే
కప్పము లందుకొంటివి ప్రగాఢ యశస్సుల నందిమాన్యుడా !

వ్రాయగవచ్చు గ్రంథములు వందలువేలు శ్రమించి 'లక్ష్మినా
రాయణ చౌదరీ ! తమ కరంబున గుప్పిన నగ్నసత్యముల్
వ్రాయగ నే మహాత్ముని కలంబుకు దమ్ములు గల్గెనేడు—దీ
ర్ఘాయువు నీకు మా తెలుగు రాష్ట్ర రమా పురిటింటిలోపలన్.

ప్రాచీనభారత గ్రంథాలను చరిత్ర వ్రాసి యెంతయొ మేలుచేసినావు
పాండవుల్ శతశృంగ ప్రాంతంబువారని బలమైన సాక్ష్యముల్ తెలిపినావు
చరితనంతయు త్రిప్పి చర్చించి రాముని బండారమును బయల్ పరచినావు
నాగార్జునుడు మధ్య మాగాణములయందు పుట్టెనంచును తొడగొట్టినావు

పూర్వచరితమ్ము తూర్పారబోసి నేడు
సత్యమార్గంబు లోకాన చాటుచున్న
నీకు ఋణపడియున్నదీ లోకమెల్ల
—— అందుకోవయ్య ! మాకృతజ్ఞాంజలులను.

(కవిరావు - డిసెం-47)

# BIBLIOGRAPHY

*Dr. D. Jivanayakam*—
The Theory and practice of education

*Prof. Kilpatrik*— Foundations of project method

*Stevenson*— The Project method

*Ryburn*— All Books

*James Hemming*— The teaching of social studies

*Hemachandra Rai Choudari*— Political History of India.

*C. S. Sreenivasachary*— A history of India

*Rhys Davids*— Buddhist India

*R. N. Mehtha*— Pre-Buddhist India

*Fick*— Social organization during Buddha's time.

*Thomas Keightely*— History of I dia

*G. Thompson*— British rule in India.

*Vimal Charan Law*— Kshatriya clans in Ancient India.

*Elphinston*— History of India.

*Vaij Nath Puri*— Ancient Greek writers.

*Rapson etc*— Cambridge History of India. Vol. I and II.

*J. W. Mc. Crindle*— All works.

*James Legge*— Travels of Pahiyan

T. *Watters*— Yuan Chwang's travels 2 Vol.

*Beal*— Life of yuan Chwang.

*R. S. Pandit*— Kalhana's Raja-tharangini.

*Cowell*— Jataka tales 6 Vol.

*Maxmuller*— Sacred books of the East series.

*V. A. Smith*— Early History of India.
Oxford history of India.

*R. C. Dutt*— Ancient India.

*R. K. Mukerjee*— Hindu civilization

Also Lalitha Vistara, Soundara Nandam etc.

---

## తెలుగు

కె. వి. లక్ష్మణరావు — హిందూమహాయుగము

చిలుకూరి వీరభద్రరావు, ఆంధ్రుల చరిత్ర (3 సంపుటములు)

వ్యాసాశ్రమమువారు ప్రచురించిన బుద్ధచర్య

# 1. సామాజక పథకములు

సామాజక పథకములననేమి? – నిర్వచనము – ఇవి ఆచరణలోని కెట్లు వచ్చినవి? – వీనిలక్ష్యము – భారత దేశములో వీని విషయములో జరుగుచున్న పని.

సామాజక పథకములను ఆంగ్లేయ భాషలో కమ్యూనిటీ ప్రాజక్ట్సు (Community projects) అందురు. కమ్యూనిటీ అనగా సమాజము: ప్రాజక్టు అనగా పథకము లేక ప్రణాళిక అని యర్థము. విద్యావేత్తలు యీ పదమును పాఠశాలల కుపయోగించక ముందు, యింజనీయర్లు, సర్వేయర్లు తమతమ ప్రణాళికలకు యీ పదము నుపయోగించుకొనుచుండిరి. "ప్రణాళికా భావము వ్యవసాయము బోధించుట ద్వారా విద్యారంగములో ప్రవేశించెను."[1] యీ విధముగా యీ పదమును విద్యావేత్తలు పాఠశాలల విద్యార్థుల ఉపయోగార్థము గైకొనిరి. ఇవి విద్యార్థుల ప్రణాళికలుగా రూపొందెను. ఆధునిక కాలములో విద్య యనగా "కలిసి జీవించు కళ"యని (Education is the art of living together) విద్యావేత్తలు నిర్వచనము జేయుచున్నారు. పాఠశాలలలోనివిద్యార్థులు వారియొక్క శ్రమను, కాయకష్టమును పాఠశాలా సంబంధమగు ప్రణాళికల కుపయోగించుచున్నారు. ఇదియొక క్రొత్త పద్ధతి. దీనిలో యీ క్రింది సూత్రము లిమిడియున్నవి.

---

1. *Dr. D. Jivanayakam* — The Theory & Practice of Education P. 367. "The project idea came into education through the teaching of agriculture."

1. సామాజిక పథకములను వేసికొని వానిలో గలిసి పనిచేయుటచేత బాలురకు ఆలోచనాశక్తి (thinking power), హేతువాదబుద్ధి (Reasoning) కలుగును. 'డూయీ' (Dewey) అను విద్యావేత్త గూడ అట్టి హేతువాద బుద్ధి బీజములు బాలుర మనసులలో శైశవావస్థలో పడుట చాల మంచిదని నుడివినాడు. ఏ పథకమునకైన బాలురే ముందంజ వేయుదురు.

2. క్రియా రూపముగా విద్య నేర్చుకొన వచ్చును. (Learning by doing)

3. ఒక వస్తువుయొక్క జ్ఞానమును దాని సహజస్థితిలో నుండగా గ్రహించవలెను. (Knowledge of a thing should be acquired in a natural setting.") ఇచ్చట నుండి నీవు కాశీకి కాలినడకను పోవలయునని ఎంత కాలము పట్టును? దీనికి జవాబు కేవలము గణితముపై ఆధారపడి యుండదు. అనేకమైన సహజపరిస్థితులపై ఆధారపడి యుండును.

4. పూర్వము వ్యాకరణము మున్నగునవి బోధించుచో ముందు సూత్రములు చెప్పి, వల్లింపజేసి తర్వాత ఉదాహరణము లొసంగుచుండిరి. ఈ నూత్న పద్ధతివలన సూత్రమునకంటె ముందుసమస్యను పూర్తిచేసి తర్వాత బాలురే సూత్రనిర్మాణము చేయునట్లు చేయుదురు. ("Priority of the problem over the principle").

కనుక ప్రతిప్రణాళికలో 1. కార్యము (act) 2. సమస్య (Problem) 3. కంఠస్థముజేసి నేర్చుకొనుదానికంటె అది

సహజస్థితిలోనుండగా హేతువాదబుద్ధితో, మనస్ఫూర్తియైన అభిరుచితో, కార్యసాఫల్యబుద్ధితో దాని నెమర్చుకొనుట అను ముఖ్యాంశము లిందు కలవు.

సమాజములు పలువిధములుగా కాన్పించుచున్నవి. కుటుంబము, పాఠశాల, వృత్తిపనివాండ్ర సంఘము, సమాజము, జాతి, దేశము మున్నగునవన్నియు సమాజములని చెప్పవచ్చును. ప్రతి సమాజమునకు కొన్ని ఉమ్మడియైన అవసరములు కలవు. సమాజముల సాముదాయిక కార్యములు ఐక్యతతో, పరస్పర సంబంధముతో, భ్రాతృభావముతో మనస్ఫూర్తిగా జరుపుచుండును. ఒక్కొక్కవిధమైన చురుకుదనము, శ్రద్ధ, ఉత్సాహము, చైతన్యము ఆయాకార్యములలో కేంద్రీకృతమై యుండును. డాక్టర్. మెకే (Dr. Mackee) పంజాబులోని మోగా (Moga) లో యీ పద్ధతి నవలంబించి సఫలతనొందెను. ఈ పద్ధతివలన దేశములోని గ్రామీణ విద్యావిధానము విప్లవాత్మకమగునని విద్వాంసుల యభిప్రాయమగుచున్నది.[2] పథకములకు యీ విధముగా ఆచార్య 'కీల్ పాట్రిక్' (Prof. Kil patrik) నిర్వచనము చెప్పెను[3]. "పథకములు ఒక సాంఘిక పరిసరములో పురోగమించు మనస్ఫూర్తియైన, అవసరములో కూడిన, చురుకైన కార్యములు". స్టీవెన్సను (Stevenson) "అది సహజరూపములో పూర్తి

---

2. "*Ibid* — It is found to revolutionise rural education in the country."

3. *Prof. Kilpatrik* — Foundations of project method. "Projects are whole hearted purposeful activities proceeding in a social environment."

చేయబడిన సమస్యాయుత కార్యము"[4] అని చెప్పెను. బిన్నింగ్సు జీవితసందర్భములలో పూర్తిచేయబడినట్టి, బాలుడు పన్నిన ఉద్దేశ్యముతో కూడినట్టియు పనియనెను. ("A Pupil planned purposeful task accomplished in a life-like situation") మానసిక, శారీరసంబంధమైన యీ పథకములకు (Mental and Manual projects) అనేకవిధములైన ప్రతిభావంతమైన విశేషములు గలవు. (1) ఆలోచనలేక పథకము పన్నుట (2) పథకము నిర్వహించుటలో శారీర నిర్మాణము, శక్తి, దృఢత్వము, చురుకుదనము, ఉత్సాహము గల్గును.

3. ఉద్దేశ్యముతో గూడిన కార్యము నెరవేర్చుట వలన వాస్తవిక పరిస్థితి, సహజస్థితి తెలియును. శారీరక, మానసిక సంబంధమగు చురుకుదనము, కార్యసాఫల్యమునకు సర్వవిధముల తోడ్పడును[5]. ఈ సామాజిక పథకముల లోని భావములను గుర్తించి విద్యావేత్తలు విద్యార్థులలో సమాజపథకముల నేర్పాటుచేసి వారిచేత కార్యములను పూర్తికావించు చున్నారు. ఏతత్ఫలితముగా పాఠశాలలోని విద్యార్థిలోకమునకు గల్గు ఉపకారము ఇంతింతయని చెప్ప వీలులేకయున్నది. తమతోటి వారి సంబంధములోగాక

---

4. *Stevenson* — The project method. "A problematic act carried to its completion in its natural setting."

5. "A project includes pupil planning, a purposeful task and a real situation. Activity mental and physical leads to the accomplishment of a task. — Project is linked with reality.

ఇతరత్రా ఎవరును అభివృద్ధి చెందలేరు[6]. ఈ సూత్రప్రకారము తాను, తమతోటి వారు అందరు కలసి ఒకేసారిగా అభివృద్ధి చెందుదురు. సోమరితనము దూరమగుటచేత అందరు మంచి వారగుదురు. (*Voltaire* — "All people are good except those who are idle.")

ప్రణాళికయందు i బాలురచే పన్నుగడ ii ఉద్దేశ పూర్వక్రియ iii నిజపరిస్థితి యుండును. మానసిక, శారీరక క్రియలద్వారా సాఫల్యత చేకూరును. ఇట్లు, ప్రణాళిక యదార్థ పరిస్థితులతో జతపరుప బడుటచే ముఖ్యమైనది.

ఇట్టి ఉత్కృష్టమైన సామాజిక పథకములను భారత దేశ నాయకులు శ్రీ నెహ్రూ మున్నగువారు దేశ సౌభాగ్య మునకు, నవ్యభారత వర్ష నిర్మాణమునకు, విప్లవాత్మకమైన నవోత్సాహమునకు, చిహ్నములని, ఉపయుక్తములగునని భారతదేశ మంతట వ్యాప్తిచేయు చున్నారు. ఇవి భారత దేశ పరిస్థితుల కనుకూలమైనవి. జాతీయ కార్యక్రమములో కలిసి పనిజేయ వలెనను ఉత్సాహము, గొప్ప జాతీయ కార్య నిర్వహణములో తాము గూడ భాగస్వాములమన్న జాతీయ భావము (National consciousness) ప్రజలలో వృద్ధి పొందును. అభివృద్ధి కవసరమైన నవశక్తి, ఉత్సాహము గలుగును. సాంఘిక విప్లవమునకు కూడ ఇది చిహ్నము. మనసును అభ్యుదయ మార్గములో నడిపించును. సంఘమున కుపయోగించు కార్యములను సమాజమే యోచించి వానిని రూపొందించు కొనును. చురుకుదనము ఉత్సాహములతో

6. *Ryburn* — "No individual can develop except in relation to his fellows. — All development must be social development."

తమ శ్రమ, ద్రవ్యముల నుపయోగించి, శక్తి, ఉత్సాహము లతో పథకములను సాఫల్యము జేయు చున్నారు. ఇవియే సామాజిక పథకములు. వారి వారి కార్యములు సాఫల్యము జేయుటకు బాధ్యత వహించెదరు. మేధస్సుతో బాటు, కాళ్లు చేతులుకూడ ఉపయోగించెదరు. వాస్తవిక దృక్పథము అలవడును. ఈ పథకములు నూత్నవిధమైన నైపుణ్యము, కళ ప్రతిభలను అభివృద్ధి జేయుననుటలో సంశయములేదు. ప్రజలలోని జడత్వము నిర్మూలింపబడి చురుకుదనము గల్గును. భారత దేశములోని ప్రతి పౌరుడు సమాజ జీవితమున కల వాటు పడును. సమాజ జీవితమున కలవాటు పడినవారికి ఆరోగ్యకరమైన దేహములు, లెస్సగా తర్ఫీదు నొందిన మనస్సులు, లోటులేని పూర్తిత్వములు గలిగి స్వార్థమునకు గాక సమాజమున కంతటికి తోడ్పడుదురు. ఈ ప్రకారము సమాజమంతయు ఉన్నత లక్ష్యములుగల్గి పురోగమించును. గొప్పసమాజము గొప్పజాతిని "(A greater community a greater nation) తయారుచేయును. మన "విద్యాప్రయత్న ముల ఉద్దేశము సమాజములోని మానవుడుగాని, (వ్యక్తిగత) మానవుడుకాడు." అని హెమ్మింగ్ (Hemming) నుడివి నాడు[7]. ఈ విధముగా సమాజములోని ప్రతి మనుజుని బాగోగులే తన బాగోగులని ప్రతి వ్యక్తి తలంచినచో సమా జము అత్యల్పకాలములో ఉన్నతి గాంచును; తద్వారా జాతి, దేశము వృద్ధిజెందును. "నీవు జీవించి యితరులను జీవించనిమ్ము" (Live & let live) అను లక్ష్య మలవాటు

7. *James Hemming*— The teaching of Social studies P. 20. "Not man but man in community must be the object of our educational endeavour."

పడును. సహకారమభివృద్ధి చెందును. ప్రజలు ఉత్సాహముతో ఆలోచనలో పాల్గొందురు. తమ యొక్క ప్రధానమైన కాయకష్టమే కాకుండా ధన, ధాన్య, వస్తు, అంగబల రూపములలో ప్రజలు సహాయపడుటచేత, ప్రజలు యిది తమ ప్రణాళికయని గుర్తించు కొందురు. స్వశక్తియే ఉత్తమమైనదని తెలిసికొందురు. గొప్ప కార్యములను నిర్వహించగలమను ఆత్మ ధైర్యము గలుగును. ప్రజలలో అసమానత్వము తగ్గి భ్రాతృభావము, సమత్వము గల్గును. శాంతియుత సహకార జీవనమునకు పునాదులేర్పడును. న్యాయము, సహనము, స్వేచ్ఛగల ప్రజాస్వామిక సమాజము త్వరలో నేర్పడును. ఆ జీవిత సరళి శీఘ్రముగా సలవడును. ఈ విధముగా మొత్తము దేశమున కంతటికి వర్తించినచో సువిశాలమైన భారతావని యంతయు నూతన సమాజమును నిర్మించగల్గి సభ్యతగల ప్రజాస్వామికమును (Civilized democracy) వదలిపెట్ట జాలదు. ముఖ్యముగా జడత్వముగల గ్రామీణ ప్రజలలో అభ్యుదయకరమైన మార్పులు అల్పకాలములో జరుగును. శాస్త్రీయ దృక్పథముగల్గును. మనకుగల లక్ష్యములు కొద్దికాలములో సాధించగల్గుదుము. మాటలతోగాక చేతులతో పనులు సాధించగల్గుదుము. మనలో నవ్యచైతన్యము గల్గును. ముఖ్యముగా గ్రామీణప్రజలు వీనివలన చైతన్యవంతులగుదురు. ప్రజలకు ప్రభుత్వ కార్యకలాపములలో సన్నిహిత సంబంధము గల్గును. ప్రజలే ప్రభుత్వము, ప్రభుత్వమే ప్రజలు అను భావము దృఢముగా నాటుకొనును. ప్రజల దృక్పథములో మార్పులుగల్గి స్వంతముగా అభివృద్ధికార్యక్రమములను అమలుజరుపుకొను అలవాటు ప్రజలకు నిస్సంశ

యముగా గల్గును. నాల్గుగోడలమధ్య నేర్చిన చదువుకంటె ఆచరణవలన అనుభవము గల్గుటచేత ఎక్కువవిద్యావంతు లగుదురు. భారతదేశములోని గ్రామీణులకిది అనువైన పద్ధతి యని విదేశీయులే చెప్పుచున్నారు. ఈమధ్య రష్యా నుండి వచ్చిన మాస్కో విశ్వవిద్యాలయాచార్యుడు 'డేగ్యార్' (Prof. Degyar) యిట్లు చెప్పెను. "కమ్యూనిటీ అభివృద్ధి కార్యక్రమములద్వారా భారతభూమిలో గ్రామీణుల సంక్షేమమునకు అనువైన పద్ధతి కనుగొనుట జరిగినది. కమ్యూనిటీ కార్యక్రమములద్వారా యిండియాలో సాగు చున్న శాంతియుతవిప్లవము (Non violent revolution) చూడగా జార్ చక్రవర్తుల పరిపాలన అంతమైన తరువాత రష్యాలో సాగిన పునశ్చరణ కార్యక్రమము గుర్తుకువచ్చు చున్నది. ఈ పద్ధతిలో త్వరితగతిని భారతవర్షములో సాంఘి కముగాను ఆర్థికముగాను పునర్నిర్మాణము జరుగుట తథ్య మని నాకు నమ్మకముగల్గుచున్నది."

ఈ పథకముల లక్ష్యము గ్రామములను చైతన్య వంతముచేసి నూత్నజీవితమును బోయుట, వానిని స్వయం పోషకములుగా జేయుట, ప్రజల దృక్పథములో మార్పు గల్గించుట, సొంతముగా అభివృద్ధికార్యక్రమములు తాము జరుపుకొను అలవాటు ప్రజలలో గల్గించుట అని ఎరుంగ వచ్చును. కాయకష్టముచేయుట గౌరవహీనము అను విషయమిందు పనిచేయుటవలన పోవును. ప్రజాస్వామికమును బోధించిన గ్రీకులుకూడ గౌరవమైనపనులను వారి చేతులలో నుంచుకొని కాయకష్టసంబంధమగు పనుల నన్నిటిని బానిసలకు వదలివేసిరి. కాయకష్టము చేయుట గౌరవహీనమని వారు

తలంచిరి. ఈ పథకములు యించు మించు గ్రామపునరుద్ధరణ కార్యక్రమములు (Rural reconstruction schemes) అని చెప్పవచ్చును. గ్రామీణులకు శాస్త్రీయ దృక్పథము వృద్ధి యగును. సమాజము సర్వతోముఖముగా వృద్ధిజెందును. ఈ భావములోనుండి జాతిసేవ, మానవకోటిసేవ అను దృక్పథములోనికి నడచును. 'ప్లేటో' చెప్పినట్లు "సొంతకుటుంబము పోయినచో మొత్తము దేశమంతయు ఒకే కుటుంబమగును" (Private family being abolished, whole country should form one family) అను సూత్రము ఆచరణలోనికి వచ్చును. "ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకమ్" ఉదారచరిత్రునికి వసుధయంత కుటుంబమే యగును. జపాను, రష్యాలు 30 యేండ్లలో ఈ కమ్యూనిటీ ప్రాజెక్టులతో పనిజేసి, సహకారము, ఐక్యతతో తమదేశములను సర్వసంపన్నమైన వానినిగా తయారుజేసికొనెను. నవ్యభారత నిర్మాణమునకు భారతదేశనాయకులు కృషిసలుపుచున్నారు. అందుచేత 1952 అక్టోబరు రెండవ తేదీన గాంధీజయంతి దినమున మన దేశములో సామాజకపథకముల నారంభించిరి. మన దేశములో $7\frac{1}{2}$ లక్షల గ్రామములున్నవి. నూటికి 80 మంది గ్రామములలోనివసించుచున్నారు. గాంధీజయంతి దినమున మన దేశమున 55 కమ్యూనిటీ ప్రాజెకుల నారంభించిరి. ఒకకోటి నలుబదిలక్షల జనులుగల పదహారువేల ఐదువందల గ్రామములలోనివి ఆరంభించబడినవి. విద్య, విద్యుత్తు, ఆరోగ్యము, వ్యాపారాదులు, వ్యవసాయము, పరిశ్రమలు, రాకపోకలకు రోడ్లు, తోటలు, గృహముల నిర్మాణము మున్నగువానిలో గ్రామీణులు అభివృద్ధి

గాంచవలెననియే వీనిఉద్దేశ్యము. నూరు కుటుంబములుగల్గి, 500 మంది జనులు గల ఒకగ్రామము ఒక యూనిట్‌గ తీసికోబడినది. అందు సగముమంది కృషీవలురు. కొన్ని మాండీ యూనిట్లలో దుకాణములు, పాఠశాలలు, ధర్మ వైద్యశాలలు, ఠాణాలుండును. ఐదు మాండీయూనిట్లు గలిసి ఒక అభివృద్ధి కేంద్రమగును. ఇందు 1000 కుటుంబములు, 5000 జనాభాయుండును. ఇందు ఉన్నత పాఠశాలలు, ధర్మ వైద్యశాలలు, పశువైద్యశాలలు, పోస్టు, టెలిగ్రాఫు ఆఫీసులు మున్నగునవి యుండును. అట్టి మూడు అభివృద్ధి కేంద్రములు కలిసి ఒక కమ్యూనిటీప్రాజెక్టు అగును. ఇందు 10 మొదలు 20 వేలవరకు జను లుందురు. ఇందులో గ్రామీణ పునర్నిర్మాణమునకు కావలసిన పలురకములైన పరిశోధనా కేంద్రములు, కార్ఖానాలు, కుటీరపరిశ్రమలుండును. వీనివలన 26850 చ. మై. విస్తీర్ణముగల ప్రదేశము వ్యవసాయక్షేత్రమై యుండును.

కమ్యూనిటీ ప్రాజెక్టుల కార్యక్రమమునకు, ప్రజల నుండి వచ్చెడు సహాయము ప్రభుత్వసహాయ మంతయున్నది అని ప్రభుత్వ నివేదిక తెల్పుచున్నది. ప్రజలు రొఖ్ఖరూపము గాను, కాయకష్టరూపముగాను, వస్తురూపముగాను సహాయ పడుచున్నారు. ఇప్పటికి ప్రభుత్వము 11 కోట్ల 2 లక్షలు ఖర్చుపెట్టగా ప్రజలు 477 లక్షలు సహాయ పడిరి. దేశము మొత్తముమీద $\frac{1}{5}$ వంతు ప్రజలలో ఈ కార్యక్రమములు అమలులోనున్నవి. మొత్తము 828 బ్లాకులలోను 220 బ్లాకులలో 32957 గ్రామములు, 204 లక్షల జనాభాతో యుండి కమ్యూనిటీ ప్రాజెక్టుల కార్యక్రమములు అమలు

జరుగుచున్నవి. మిగతా 608 బ్లాకులలోను, 66333 గ్రామములు, 418 లక్షల జనాభాతో యుండి జాతీయ విస్తరణ కార్యక్రమములు అమలు జరుపబడు చున్నవి. ఈ సంవత్సరము ఏప్రిల్ నుండి 132 బ్లాకులను కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతములుగా మార్పు జేసినారు. బుద్ధిసంపన్నతతో బాటు కాయకష్టమున కిందు ప్రాధాన్యత ఈయబడినది.

మొత్తము 28667 కమ్యూనిటీ కేంద్రములు ఏర్పాటు జేసిరి. వీరు 12000 మైళ్ళ బారున రోడ్లు వేసిరి. అనేక చోట్ల పాఠశాలల నేర్పాటు జేసిరి. మురుగు కాలువలు, బావులు త్రవ్విరి. వేలకొలది యకరాల బంజరులను సాగులోనికి దెచ్చిరి. మంచి విత్తనములను శ్రద్ధగా సమకూర్చి ఆహారమును అధికముగా ఉత్పత్తి జేసిరి. పండ్లతోటలు, కూరగాయల తోటలు గూడ వేసిరి. వ్యవసాయము ఆధునిక పద్ధతులలో జరుపుకొను చున్నారు. కంపోస్టు ఎరువులకు గోతులు త్రవ్వి భద్రపరచిరి. ఆరోగ్యమును కాపాడుటకు అనేక విధములైన పనులు చేసిరి. గ్రామస్థుల మేధస్సులు శాస్త్రజన్య జ్ఞానములో నభివృద్ధిచెంది, మూఢనమ్మకములకు, స్వార్థతకు దూరమై పోవలయునని నా సంకల్పము. నిద్రాణమై యున్న గ్రామములు చైతన్యవంతమై—కలకత్తా, బొంబాయిల వంటి నగరములుగా తయారు కాకపోయినను—గొప్పనాగరికత, సంస్కృతిగల ప్రజలతో చైతన్యవంతములై విలసిల్లునని చెప్పవచ్చును. చివరకు 'భగవంతుడు గ్రామమును జేసెను; మనుష్యుడు పట్టణమును నిర్మించెను' ("God made the country and man made the town") అను సామెత పాతకాలము నాటిదై, మృతమై పోవును.

# 2. ప్రాచీన భారతభూమిలో సామాజకపథకములు

త్యాగబుద్ధి – ఏకతంత్ర రాజ్యములలో ప్రజాసేవ – బౌద్ధ వాఙ్మయము – జాతక కథలు – గ్రీకు లేఖకుల వ్రాతలు – చైనీయ లేఖకుల వ్రాతలు – అనంతర వాఙ్మయము.

సామాజక పథకములు ప్రాచీన భారతములో జాల చోట్ల కాన్పించుచున్నవి. కాని ఈనాటి భారత రాజకీయ వేత్తల లక్ష్యము అందున్నదాయని తెలిసికొనుటకు బలమైన చారిత్రకాధారములు లేవు. దురదృష్ట వశాత్తు ప్రాచీన భారతీయులకు సత్యమైన చరిత్ర లేదని విద్వాంసుల అభిప్రాయము.[8] మనుస్మృతిలో నీ క్రింది భావముగల శ్లోకము గాన్పించుచున్నది. "కుటుంబము కొరకు వ్యక్తిని సంఘము కొరకు కుటుంబమును, దేశము కొరకు సంఘమును, ఆత్మకొరకు మొత్తము ప్రపంచమును త్యాగము చేయుము."[9] (త్యజేత్ ఏకంకులస్యార్థే। గ్రామస్యార్థే కులంత్యజేత్। గ్రామంజనపదస్యార్థే। ఆత్మార్థే పృథివీంత్యజేత్ ।।) మహాభి నిష్క్రమణము జరుగునాటి రాత్రి గౌతముడు ఆఖరుసారి నవజాత శిశువగు సుతునిజూడ నిచ్ఛగల్గగా, తనసతి నిదురించు శయనగృహము యొక్క తలుపు తెరచి లోనికిపోయెను. భార్యను, బుత్రుని

---

8. *Hemachandra Rai Choudary* — Political history of Ancient India : "No Thucydides or Tacitus has left for posterity a genuine history of Ancient India."

9. Manusmrithi, "For the family sacrifice the individual, for the community the family, for the country the community, and for the soul the whole world."

జూచుట తోడనే మనసు వెనుకకు లాగెను. అంతర్వాణి యిట్లు చెప్పెనని కర్మయోగము తెల్పుచున్నది. "గృహస్థుడవై యున్నచో నీవొక భార్యను, బిడ్డను మాత్రమే కడ తేర్చుకోగలవు. లోకసేవచేయ జగత్తులోనికి వెడలినచో, 180 కోట్ల జీవరాసుల నుద్ధరించగలవు; దుఃఖనివారణోపాయము కనుగొన గలవు; కాన తక్షణమే గృహమును వీడి లోకసేవ చేయబొమ్ము". ప్రపంచసేవ చేయ సంకల్పించిన (Service for humanity) గౌతముడు తక్షణమే గృహమును వదలి వెడలిపోయెను. ఈ పథకములలో 'సంఘ శ్రేయస్సే తన శ్రేయస్సు' అను భావము గల్గును.

మహావగ్గమును బట్టి 'బింబిసారుని' రాజ్యములో 80000 గ్రామములు కలవని తెలియును. ఆ 'గామికలు' ఒక గొప్పసభలో గలసికొనుచుండిరి. బావులు, చెరువులు, నీటి పట్టులు, నీటిబుగ్గలు, ఆగారములు, రాతికట్టడములు, తోటలు, చావళ్లు, పచ్చికబయళ్లు వారే స్వయముగా నిర్మాణము చేసికొనుచుండిరి. ఆకాలమున స్వయంపోషక గ్రామ వ్యవస్థఉండెను. గణరాజ్యములు, ఏకతంత్రముకూడనుండెను. బుద్ధునికాలములో కొందరు వర్తకులు దక్షిణాపథమున కేగిరి. దక్కనురాజు, 'మీరాజెవరు' అని అడుగగా, వారిట్లుచెప్పిరి, "స్వామీ! కొన్ని రాజ్యములు గణతంత్రములు; కొన్ని ఏకతంత్రములు." అనేకచోట్ల గణతంత్రరాజ్యములలో ప్రజలేస్వయముగా సామాజిక పథకముల నేర్పాటు చేసికొని విదేశసంబంధములు లేకుండ గ్రామముల బాలించుకొను

చుండిరని, సర్ చార్లెసు మెట్కాఫ్ చెప్పెను.[10] తమిళ దేశములోగూడ గ్రామసభలు కలవని అనేక శిలాశాసనములు తెల్పును. హారిగుంఫ శాసనమునుబట్టి కళింగస్వయంపాలకమని, రెండవఅమ్మిరాజు శిలాశాసనములో నొక చోట గ్రామసభకూడుతావు హద్దుగా పేర్కొన బడినదని తెలియుచున్నది. తమిళ గ్రామీణులు చెట్లక్రింద కూర్చుండి తగాదాలు తీర్పు చెప్పుచుండిరని, పంచాయితీ కలదని, పౌరసంఘములు, శ్రేణులు గలవని ఒక చరిత్రకారుడు వ్రాసెను.[11]

ప్రాచీన భారతవర్షములో సాంఘికముగా ధర్మ వైద్యశాలలు, పాఠశాలలు, బావులు, బాటలు, కోనేరులు, ధర్మశాలలు నిర్మించుకొనిరి; అడవుల ఛేదించిరి. వృత్తిపనివారు శ్రేణులనేర్పరచుకొనిరి. మతసంబంధముగా స్థూపములు, సంఘారామములు, చైత్యములు, విహారములు, దేవాలయములు, గుహాలు నిర్మించుకొనిరి. రాజకీయముగా ప్రజాతంత్రభవనములు, శాంతాగారములు, అతిథిశాలలు, పంచమండలి భవనములు నిర్మించుకొనిరి. రెండవ చంద్రగుప్తుని 'సాంచి'

---

10. *Sir Charles Metcalfe* — "The village communities are little republics having nearly everything they can want within themselves and almost independent of any foreign relations."

11. C. S. *Sreenivasachary*—A history of India P. 194 "Every village was a self governing unit, having its own headman and panchayat which was both an excecutive and a judicial body. We also hear of general assemblies of all the villagers. Towns had a corporation. Trade and industry were regulated by guilds."

శిలాశాసనములో నొక పంచమండలి పేర్కొనబడినది. వ్యవసాయరంగములో చెరువులు, కాల్వలు త్రవ్వుకొనిరి. ఆనకట్టలు నిర్మించుకొనిరి. వ్యవసాయపథకములను దయారు చేసికొనిరి. మిల్ యిట్లు వ్రాసెనని 'థామస్ కెయట్లీ' తన భారతవర్ష చరిత్రలో వ్రాసెను. "చిన్న కృషీవలురకు గావలసిన వన్ని గ్రామసంఘములచేత సరఫరా చేయబడుచుండెను. సంఘమునకు కావలసిన ఉమ్మడిశిల్పులు, అప్పిచ్చువాండ్రు, కావలిగాండ్రు కలరు; నూర్పిడి స్థలములు ఉండెను." [12]

బుద్ధుడు చదువుకొన్న కపిలవస్తులోని పాఠశాలను శాక్యసంఘమే నిర్మించుకొనెను. ఆ పాఠశాలకు బుద్ధుడు 'ఉరగసార చందసము'తో జేయబడిన పలకనుగైకొని, రత్నములతో గూర్చిన బంగారుకలమును, మంచిసిరాను గైకొని, గురువగు విశ్వామిత్రునిచెంత కరిగెనని 'లలిత విస్తారము' తెల్పుచున్నది. బుద్ధుని జీవితచరిత్రమును దెల్పువానిలో నిది మొదటిది.

రాజు లనేకచోట్ల కాల్వలు, చెరువులు త్రవ్వి ఆనకట్టలుకట్టిరి. కాని అవి సామాజకపథకములుగావు. క్రీ.పూ. 4వ శతాబ్దములో చంద్రగుప్తుడు ఒకానొక పర్వతము దిగువ భాగమున కృషీవలురకు 'సుదర్శనసరస్సు'ను త్రవ్వించెను. అశోకుడు దానినుంచి వ్యవసాయము చేయుటకు కాల్వలు

---

12. *Thomas Keightly* — History of India. P. 389. "What is wanting to small cultivators is supplied by their union in village communities; the community has its common artificers and bankers and watchmen and thrashing places."

త్రవ్వించెను. 'స్కందగుప్తుని' కాలములో ఆ చెరువుయొక్క గట్లు, వర్షములు వరదలచేత కొట్టుకొనిపోయెను. 'జునాగఢ' శాసనమునుబట్టి, 'స్కందగుప్తుడు' పర్ణదత్తుని సౌరాష్ట్ర పాలకునిగా జేసెనని, ఆయన కుమారుడు 'చక్రపాలిత' అనువాడు విశేషముగా ద్రవ్యము ఖర్చిడి చెరువుగట్లను కాల్వలను మరమ్మతు చేసెనని కృషీవలుర కిది లాభదాయకమై యుండెనని తెలియుచున్నది. పైరుద్రదాముని శాసనమునుబట్టి శక కాలము 72 వ సం॥న సుదర్శనసరస్సు గట్లు తెగిపోయినట్లు తెలియును. ఈ గట్లు చంద్రగుప్తమౌర్యుని కాలమున 'పుష్య గుప్తుని'చేత, అశోకుని కాలమున 'తుషాష్పుడను' యవనరాజు చేత బాగుచేయించ బడినదని పై శాసనము తెల్పుచున్నది. కళింగరాజు, 35 లక్షలప్రజల యోగక్షేమములజూచిన ఖార వేలుడు పూర్వమునందరాజులు నిర్మించిన జలాశయము శిధిలముగా నుండుటగాంచి, దానిని తిరిగినిర్మాణము చేయించెను. కళింగ నగరమునకు నీటివసతి కల్పించెను. 'హుమాయూను' నోడించిన 'షర్షా' బాటలువేసి, చెట్లునాటి, బావులు త్రవ్వి ప్రజల కుపయోగముచేసెను. కృష్ణరాయలు తన 'ఆముక్తమాల్యద'లో సామంతులను చెరువులు వృద్ధిచేయుడని కోరెను. బుక్కరాయచెరువు, రాయలచెరువు మున్నగునవి కలవు. ఈ చెరువులకు నీరువచ్చుటకు అనేక కాల్వలను విజయనగరరాజులు త్రవ్వించిరి. మొదటి దేవరాయలు విజయనగరమునకు 12 మైళ్లు దూరమున తుంగభద్రకు ఆనకట్టకట్టి, ఒక కాల్వద్వారా విజయనగరమునకు నీటి సరఫరా చేసెను. కృష్ణరాయలు తుంగభద్రకు ఆనకట్టకట్టి, అనేక చెరువులకు నీరువచ్చునట్లు చేసెను. పోర్చుగీసు ఇంజనీర్ల

సాయమున పై పని చేసెనని తెలియుచున్నది. విజయనగర రాజు 'బుక్కరాయల' కాలమున 'సింగయభట్టు' అను జలసూత్ర విద్యావిశారదుడు (Hydraulic engineer)కలడు. ఆయన హిందానదినుండి కాల్వత్రవ్వించి పెనుగొండ దగ్గర ఉన్న 'శిరవారసరస్సు'కు నీరు నడుపుకొని పోయినాడు. దీనిపేరు 'ప్రతాప బుక్కరాయమహా మండలకాల్వ'. షాజహాను కాలమున 'ఆలీమర్దన్ ఖాన్' రావీనది మీద అనేక పనులుచేసి పంజాబుప్రజల కుపకారము చేసెను. ఆంధ్ర దేశములో రెడ్డిరాజులు, ప్రజోప యోగార్థము చెరువులు, కాల్వలు, బావులు త్రవ్వించి, వ్యవసాయాభివృద్ధిని జేసినారు. ముస్లిముప్రభువులుకూడ అనేక చెరువులు, కాలువలు త్రవ్వించి, ఆనకట్టలు కట్టించి ప్రజాసేవ చేసినారు. కాని ఇవి సామాజిక పథకములుకావు. స్వయంసంపూర్ణ గ్రామవ్యవస్థ గలచోట్ల సమాజమంతయు గలసి గ్రామశ్రేయస్సు కొరకు చేసిన కార్యములు సమాజపథకములుగా గాన్పించుచున్నవి. "పంచాయితీలు గలవని, వర్ణాశ్రమధర్మముల నమలు జరిపిరని, బావులు, చెరువులు త్రవ్వి చిన్నతగాదాలను పరిష్కరించెడివారని" 'థాంప్సను' వ్రాసెను. (*G. Thompson*—British rule in India—There were councils of elders. They enforced caste rules, maintained village wells and tanks and exercised some control over minor offences.)

బౌద్ధ వాఙ్మయము: క్రీ.పూ. 6వ శతాబ్దములో భారత భూమిలో ననేక గణరాజ్యములు కలవు. అందు ముఖ్యములు (1) శాక్యులు (2) కుశినరమల్లులు (3) పావానగరమల్లులు

(4) మిథిలలోని విదేహులు (5) వైశాలి లిచ్ఛవులు (6) వజ్జి గణసంఘము (7) బులీయులు (8 కోలీయులు (9) మోరీలు (10) భగ్గులు (11) కాలాములు. వీరికెల్లరకు శాంతాగారము లుండెను. వీనిని ప్రజలే నిర్మించుకొనుచుండిరి. రాజకీయ, సాంఘికాది సమస్తకార్యములు అందు జరుపుకొనుచుండిరి. కపిలవస్తులోని ప్రజాతంత్ర భవనముకు 'అంబష్టుడు' ఏదోపనిమీద పోయినపుడు అచట శాక్యకుమార్లు తమ ప్రజాతంత్ర భవనములో ఉన్నతాసనములపై కూర్చుండి, ఒకరినొకరు గేలి చేయుచు నా బ్రాహ్మణుని కూర్చుండుమని చెప్పలేదు. అందుచే శాక్యజాతిని క్షుద్రజాతియని 'అంబష్టుడు' పేర్కొనెను.

శుద్ధోధనుని రెండవభార్య 'మహా ప్రజాపతి గౌతమి' వలన 'నందుడు' అను కుమారుడు గల్గెను. ఈ 'నందుని' గూర్చియే కనిష్కుని ఆస్థానకవి 'అశ్వఘోషుడు' 'సౌందర నందం' రచించెను. ఈ కవి మొదటి సర్గలో 'కపిలవస్తు' నగరమును గూర్చి వర్ణించెను. ఎత్తయిన గోడలతో 'కపిల వస్తు' నగర ప్రాకారము అందముగా నుండెను. శాక్య రాజ కుమారులు ఉద్యానవనములు ఏర్పరచిరి. కోనేళ్లు త్రవ్విరి. ఉపవనములు, పెద్దధర్మశాలలు, బావులు నిర్మించిరి. రాజ కుమార్లు పట్టణములో సభలు, సమావేశములు జరుపుచుండిరి." ఈ సభలకే శాక్యులు ఆగారములు నిర్మించుకొనిరి. ఇవి యన్ని పట్టణమంత సమష్టిగా, జరుపుకొను చుండిరని తెలియుచున్నది.

శాక్యుల సంబంధమగు పుష్కరిణి 'దేవదహము' అను కోనేరు లుంబినీవనము దగ్గరనే ఉన్నది. అచట 'ఉపస్థాన

శాల' కలదు. బుద్ధుని కాలమున నొక క్రొత్త శాంతాగారము 'కపిలవస్తు'లో నిర్మించబడెను. ఈ శాంతాగారము తెరపించుటకు బుద్ధుని దీసికొని వచ్చిరి. రాత్రి వేళలలో బుద్ధుడు, ఆనందుడు, మొగ్గల్లన అనువారు ఉపన్యసించిరి. కుశీనారా మల్లులకొక 'ప్రజాతంత్ర భవనము' గలదు. 'భగవాన్ బుద్ధుని' సందేశము వినిపించుటకు ఆనందుడీ ప్రజాతంత్ర భవనమున కేగినపుడు, వారేదోపనిమీద సమావేశమయిరి. కుశీనారాలోని శాంతాగారమునుండి బుద్ధుని పవిత్రాస్థులను గైకొని 'అజాత శత్రుడు' దారి పొడుగున నృత్యగీత వాద్యములతో పూజలతో, వైభవముగ రాజగృహ చేరుసరికి 7 ఏండ్లు 7 నెలల 7 దినములు పట్టెనని 'బుద్ధచర్య' (P 529) తెల్పుచున్నది. పావానగరమల్లులకొక శాంతాగారము గలదు. కాని మరియొక ఎత్తయిన నూత్న శాంతాగారము 'ఉభటక' అను దానిని వారునిర్మించుకొని, దానిని తెరపించుటకు 'బుద్ధదేవుని' ఆహ్వానించిరి. మల్లులు నిర్మించుకొన్న దేవమందిరమునకు 'ముకుటబంధనము' అని పేరుగలదు. మిథిలలోని విదేహులకు కూడ 'ప్రజాతంత్ర భవనము' గలదు. లిచ్ఛవులు తమ శాంతాగారములో బుద్ధుని బోధలను జర్చించుటకు సమావేశమగుచుండిరి. వజ్జియనుల సభాగృహములో, విపత్కర సమయములలో సన్నిపాత భేరి ప్రమోగించ బడినచో, ప్రజానాయకు లదివిని తినుచున్న, త్రాగుచున్న, పనిచేయుచున్న వదలివచ్చి సభజరుపుదురు. ఇంకను మిగతావారికి కూడ ప్రజాతంత్ర భవనములు గలవు. ఇవియన్ని ప్రజలే నిర్మించుకొనిరి. రాజకీయసంబంధమగు అతిథులకు అతిథిశాలలుండెను. ఇట్టిది శాక్యులకొకటి

గలదు. బుద్ధుడు 'పాటలి' చేరినపుడు భక్తులేగి, తమ గ్రామములోని 'ఆవసథాగారము' అను అతిథిశాలలో నుండుట కాహ్వానించిరి. ప్రభుత్వాధికార్లు వచ్చుచో, నివసించుటకు పౌరులే ఈ ధర్మశాలను నిర్మించిరి. (బుద్ధచర్య P 504) అర్థకథనుబట్టి 'రాజగృహా'లో ధర్మశాల కలదని తెలియును. ప్రసేనజిత్తు సతీసమేతముగా రాజగృహాకు బోవుచుండెను. మార్గమధ్యమున అన్నము సరిపడక విరేచనములాయెను; 'రాజగృహా' ద్వారములు మూసియుండెను. ఊరిబయట ధర్మశాల కలదు. ఆ రాత్రియంత దీనిలో గడపెను; కాని తెల్లవారుసరికి ఆ రాజు భార్య ఒడిలోనే మరణించెను. ఇది 'విషూచి'జాడ్యమేమో!

జీవకచరిత్రము వైశాలీలో 7777 మేడలు, 7777 కూటాగారములు, 7777 ఆరామములు, 7777 పుష్కరిణులు కలవని (P 294) తెలుపుచున్నది. వైశాలిమహానగరములో 'కూటాగారశాల' కలదు. అచట 'ఉపస్థానశాల' కూడ కలదు. వైశాలిలో మహావనములోని 'కూటాగారశాల'లో బుద్ధుడుండెను. అచ్చలయందును, చావిళ్ళయందును, సంస్థాగారములగు సభాగృహములందు, సామాన్యపౌరులే కాక, గణక్షత్రియులగు లిచ్ఛవీనాయకులు బుద్ధుని, అతని సంఘమును, అతని ధర్మమును వేనోళ్ళ కొనియాడిరి. (బుద్ధచర్య 112) ఇచట అగ్ని, చంక్రమణశాలలు, గదులు, మండపములు, పుష్కరిణులు, గంధకుటి కలవు. మరియు 183 వ పుటలో నీ క్రింది ఉదంతముగలదు. భగవానుడు శ్రావస్తిలో అనాథపిండకుని 'జేతవనవిహారము'లో నుండెను. ఆ సమయమున నచటివారు సంఘబీజములను వ్యక్తిగతక్షేత్రములందు,

వ్యక్తిగతమగు విత్తనములను సంఘసంబంధమగు పొలము లందు విత్తుచుండెడివారు. భగవాను డిట్లుచెప్పెను. "సంఘ బీజములను వ్యక్తిగత క్షేత్రములందు వేసినచో భూస్వామికి పదింట నొకభాగమిచ్చి అనుభవించవలెను. అట్లే వ్యక్తిగత బీజములను సంఘక్షేత్రములందు విత్తినచో భూస్వామికి పదింట నొక భాగమివ్వవలెను. ఇది ప్రాచీన ప్రథ (అర్థకథ). దీనినిబట్టి ఆకాలమున ఉమ్మడియైన సంఘ క్షేత్రములు కలవని స్పష్టపడు చున్నది.

గ్రామములకు పట్టణములకు దూరముగా నదులులేని చోట్ల బౌద్ధసంఘము పెద్దచెఱువులను, కొలనులను త్రవ్వు కొనెను. భట్టిప్రోలు, జగ్గయ్యపేటలలో యివి కాన్పించును. బుద్ధజయంతి సందర్భముగా ఈ చరిత్రకారుడు జగ్గయ్యపేట కేగ శిథిలమైన స్థూపమును, చెరువును జూచివచ్చినాడు. నాగార్జున కొండదగ్గర కూడ కృష్ణానదినుండి సంఘారామము వరకు ఒక కాలువ త్రవ్వబడినది. కొండమీద గల ఒక శాసన ప్రమాణము చేత బౌద్ధసంఘము అనేకచోట్ల చెరువులు బావులు త్రవ్వినట్లు తెలిసికొనవచ్చును. సింహాచలము కొండప్రక్కను కూడ బౌద్ధులు ఏర్పరచిన యిట్టి నీటిపట్టులు కలవు. ఇవియన్నియు సామాజక పథకముల క్రింద కేవచ్చును.

**జాతకకథలు:**—కుణాల జాతకమునుబట్టి కపిలవస్తులోని శాక్యులు, కోలీయులు కలిసి రెండునగరముల మధ్య ప్రవ హించుచున్న 'రోహిణీ' నదికి ఉభయులు ఆనకట్ట కట్టించు కొనిరని అటుశాక్యులు, యిటు కోలీయులు కూడ పైర్లకు నీరు పారించుకొనుచు వ్యవసాయము చేసుకొనుచుండిరని

తెలియుచున్నది. ఇది ఒక సామాజక పథకము. కొన్నాళ్ళకు వారిలో వారికి తగాదాకలైను. జ్యేష్టమాసమున ఒకసారి నీరుచాలక పైరులెండి పోవుటచేత ఉభయులు తగాదాపడిరి. కోలీయులు తామే నీరును ముందు తీసికోవలెనని తలంచిరి. అప్పుడు శాక్యు లిట్లనిరి. "మీ గాదెలను నింపుకొనినచో మేమే మగుదుము. మేము నీటినివ్వబోము." కోపోద్రేకమున ఒకడు మరియొకని కొట్టెను. వెంటనే అది పెద్దతగాదాగా మారి కోలీయులు శాక్యులు పరస్పరము నిందించు కొనుచు యుద్ధసన్నద్ధులైరి. బుద్ధదేవుడది విని 'రోహిణీ' నదిచెంతకు వచ్చి ఉభయసేనలమధ్య ప్రవేశించి వారికి బుద్ధులుచెప్పి నిర్మాల్యమైన నీటికొఱకు రక్తమును పోగొట్టుకొనుట పాడిగాదని బోధించి వారితగాదా నివారించెను. (బుద్ధచర్య P 254)

ఈ క్రిందివిషయము ఆ కాలపు గ్రామపునర్నిర్మాణ కార్యక్రమమును దెలియపరచుచున్నది. "మాచలగ్రామము లోని ప్రజలు 'మాగా' అను యువక బ్రాహ్మణుని నాయకునిగా ఎన్నుకొనిరి. ఏపనికైన ముందంజవేయుశక్తి ఆయనకు గలదు. ప్రజలందరు ఆయనచెప్పినట్లు వినుచుండిరి. వారినందరిని 'మాగ'పంచ ఆజ్ఞలలో తయారుచేసి మంచిపనులు చేయుచు వారివెంట వెడలుచుండెను. బోధిసత్త్వునితో పాటు సత్కార్యములు జేయుచు తిరుగు ప్రజలు, వేకువ జామున లేచి మంగలి కత్తులు, గొడ్డళ్ళు, గదలు హస్తములలో ధరించి బయటకు వెళ్లిపోవుచుండిరి. నాల్గు మార్గములలోని రాళ్లను వారి గదలతో యేరివేసి, రథములకు తగులు చెట్లను కొట్టివేసి, గరుకైన ప్రదేశముల చదునుచేసి, చెరువులు త్రవ్వి,

ఒక చతుశ్శాలను వారు నిర్మించిరి. 'మాచల గ్రామము' లోని ప్రజల శ్రమదానము వలననే యీ పని జరుగు చుండెను. ఆ గ్రామస్థులు స్వయం సాహాయ్యమే ఉత్తమ సాహాయ్యమని (Self help is the best help) గుర్తెరిగిరి. ఇది కమ్యూనిటీ ప్రాజెక్టుకు క్రొత్తనిదర్శనము. 'రాధా కుముదముఖర్జీ', 'ఆర్. యన్. మెహతా' మున్నగు విద్వాంసులు దీని నెంతయో ప్రశంసించిరి. 'మెహతా' ఈ సమాజ కార్యము అద్భుతమైనదని, సమాజ కార్యము యొక్క మంచి భావమును సూచించుచున్నదని, శ్రమలోని గౌరవ భావము ప్రజాహిత కార్యములోని నిజమైన ఉత్సాహము కాన్పించుచున్నదని వ్రాసెను[13]. ఈ యువక బ్రాహ్మణు డింకను ఆ గ్రామస్థులను పంచాజ్ఞలకు లోబడునట్లుగా జేసి హత్యలు మున్నగు నేరముల చేయకుండా ఆపుజేసెను. ఇట్టి సత్కార్యాచరణము వలననే, ఆకాలమున కరవు కాట కాదులు లేకుండెను. (*Megasthenese* — It is accordingly affirmed that famine has never visited India.)

జర్మను విద్వాంసుడు ఫిక్ (Fick) కూడ ఆకాలపు గ్రామస్థుల సమాజ జీవనమును, ఐక్యతను ప్రశంసించెను. ఆయన యిట్లు వ్రాసెను. "గ్రామస్థులందరు కలిసి కచేరి చావడులను విశ్రాంతి గృహములను నీటి కోనేరులను నిర్మిం

---

13. *R. N. Mehta* — Pre-Buddhist India — 'A remarkable picture thus revealing before us the healthy spirit of communal work' the sense of dignity of labour, and genuine public spirit.

చెదరు. తమ యొక్క ప్రక్కనున్న బాటలను మరమ్మత్తు జేసికొందురు. ఆరామముల నిర్మించుకొందురు. ఇట్టి ప్రజోపయోగమైన కార్యములలో స్త్రీలు కూడ చురుకుగా పాల్గొను చుండిరి. ఎచ్చటను "రాజకార్య" (Forced labour) కాన్పించదు. తర్వాత కాలములోని ధర్మశాస్త్రములలో కూడ శిల్పులు పనివారి యొద్దనుండి 'రాజకార్య'ను గైకొను చుండిరి. కాని గ్రామస్థులనుండి తీసికొనుట లేదని యున్నది. [14]

లిచ్ఛవీలలోని భూమి రాజ్యమునకు చెందినదని లేదా వైశాలి లిచ్ఛవీప్రజల ఉమ్మడిఆస్తి యని భావించుచుండిరని బౌద్ధవాఙ్మయము తెల్పుచున్నది. [15] 'ఎలిఫిన్ స్టన్' (Elphinston) అను ఆంగ్లేయ లేఖకుడుకూడ వైశాలిప్రజలు భూమి నుమ్మడిగా నుంచుకొని వ్యవసాయము చేసికొను చుండిరని అప్పటికాలఆచారము నిల్చియున్నదని వ్రాసెను.[16] బౌద్ధహిందూదేశమున 'రైస్ డేవిడ్స్' కూడ ఆ కాలపు సామాజిక గ్రామజీవనమును ప్రశంసించుచు వ్రాసెను.

---

14. *Fick* — Social organization during Buddha's time P. 48.

15. *Vimal charan law* : Kshathriya clans in ancient India P. 118. "On the other hand it is more likely that the land was held as the property of the whole state, i. e., as the common property of the Lichavi residents of Vysali, each resident having only the Sabda or title 'Rajah'."

16. *Elphinston* — History of India : "The Inhabitants of some villages cultivate the land in common according to a system still much in use."

"గ్రామస్థులందరు కలిసి వారంతట వారే ఆగారములను, విశ్రాంతిగృహములను నీటిపట్టులను నిర్మించుకొనుచుండిరని, తమకు ప్రక్క గ్రామములకు మధ్యనున్న బాటలను బాగు జేసికొనుచుండిరని, ఉద్యానవనములను కూడ వేసికొనుచుండి రని, అట్టి ప్రజోపయోగకార్యములలో స్త్రీలుకూడ పాల్గొనుట కాన్పించుచున్నదని పై లేఖకుడు వ్రాసెను. ఇంకను ప్రతి గ్రామమునకు ఒక పశువులబీడు, ఒక అడవికలదని, గ్రామస్థులకు అందరు ఉమ్మడిహక్కులు కలవని, పొలములన్ని ఒకేసారి సేద్యము చేయబడుచుండెనని, పంట కాల్వలను సంఘమే త్రవ్వుకొనుచుండెనని, గ్రామోద్యోగి ఆధిపత్యము క్రింద నీటిసరఫరా జరుగుచుండెనని సంఘమునకు విరుద్ధముగా వ్యక్తిసంబంధమైన హక్కులులేవని పై లేఖకుడు ఉల్లేఖించెను.[17] 'సంఘశ్రేయస్సే వ్యక్తిశ్రేయస్సు' అని వారెరింగిరి. ఇంకను

---

17. *Rhys Davids* — Buddhist India P. 36 : "On the other hand villages are described as uniting of their own accord, to build mote halls & rest houses & reservoirs, to mend the roads between their own & adjacent villages, & even to lay out parks and it is interesting to find that women are proud to bear a part in such works of public utility." (Jat I. Page 199)

"And each village had a grazing ground for the cattle and a considerable stretch of jungle and the villagers had common rights of waste and wood." The fields were all cultivated at the same time, the irrigation channels being laid by the community, and the supply of water regulated by rule under the supervision of the head man — But there was no such proprietory right as against the community.

బౌద్ధవాఙ్మయములో సామాజిక జీవనమునకు ఎక్కువగా ఉపయోగించు శ్రేణుల వర్ణనము కలదు. అజాతశత్రుడను మగధరాజు ఒక బౌద్ధభిక్షువునిట్లు ప్రశ్నించెను. "నీవు సన్యసించినందువలన కలుగు లాభములేమి ? 18 శ్రేణులలోని వారు తలకొకవృత్తి నవలంబించి అనేకవిధములుగా సౌఖ్యముతో జీవించుచున్నారు." దీనినిబట్టి ఆకాలమున శ్రేణులు గలవని తెలియుచున్నది. రాజు ఈ శ్రేణులద్వారానే ప్రజలను పిలుచుచుండెను. ఒక శ్రేణికి మరియొక శ్రేణికి తగాదా వచ్చినచో 'మహాశెట్టి' తగాదా తీర్చుచుండును. అనేక వృత్తులపనివాండ్రు శ్రేణులుగా ఉండి ధనము సప్పుగెకొను చుండిరి.

క్రీ.శ. 2 వ శతాబ్దములోని 'క్షహరాటానహాపానుని' సేనాధ్యక్షుడు, అల్లుడు అయిన వృషభదత్తుడు నాసికలో నాలుగుగుహాలలో శాసనములు చెక్కించెను. ఈయన అనేక ధర్మకార్యములు జేసెను. భరుకచ్ఛములో చతురస్రములు, గృహాములు, విశ్రాంతిప్రదేశములు నిర్మించెను. అనేక చోట్ల ఆరామములు నిర్మించి బావులు, చెరువులు త్రవ్వించెను. బాటసారులకు విశ్రాంతిగృహాములు, చలివేంద్రలు కట్టించెను. విద్యాలయముల, పరిషత్తుల నేర్పరచెను. బౌద్ధభిక్షువులకు గుహావిహారములు సమర్పించెను. సంవత్సరమునకు నూరు కర్షపణములు వడ్డీరాగల 2000 కర్షపణములను గోవర్ధనములోని నేతగాండ్ర కూటమికడ నుంచెను. వడ్డీ సొమ్ములోనుండి 20 మంది బౌద్ధమతాచార్యులకు ఒక్కొక్కనికి ఒక దుప్పటముచొప్పున యిచ్చునట్లు ఆజ్ఞాపించెను. ఈ సొమ్ములోనుండియే యితరవస్తువులనుగూడ వారలకు కొని

యీయవలయును. గోవర్ధములోని పౌరసభవారిట్లు తీర్మానించిరని విహారముయొక్క తలుపుమీద లిఖింపబడినది. ఇంకొకదానిలో 1000 కర్షపణములు 9% చొప్పున ఒసంగినట్లు కలదు. ఈ ప్రకారము శ్రేణులు పేర్కొనబడినవి. ప్రజలు సభాభవనములు, చెరువులు నిర్మించుకొనుచుండిరి. అనేకచోట్ల గ్రామసంఘములవద్ద మూలధన ముండెను. వారది ఖర్చుచేయక వడ్డీసొమ్మును గైకొని బౌద్ధభిక్షువులకు దుస్తులను కొనియిచ్చుచుండిరి. ధర్మశాలలు, విశ్రాంతిగృహములు నిర్మించబడుచుండెను. ఇట్టి వనేకములు శాసనములలో గాన్పించుచున్నవి. క్రీ. శ. 1088 లో ఒక తమిళశాసనమును బట్టి 1500 మంది సభ్యులుగల ఒక వర్తకసంఘము పేర్కొనబడినది.

శాతవాహనుల శాసనములబట్టి కూడ కుమ్మరి, సాలె వడ్రంగి, స్వర్ణకార మొదలగు వృత్తులవారు శ్రేణుల రూపముగా ఉండువారని తెలియుచున్నది. యజ్ఞశ్రీ శాతకర్ణి చేనేత శ్రేణివారికి 1000 కర్షపణములు, వడ్రంగి శ్రేణికి 200 కర్షపణములు, నూనెగానుగలపని వారి శ్రేణికి 500, కమ్మరి శ్రేణికి 500, స్వల్పవడ్డీకి అప్పుయిచ్చినట్లు ఒకానొక శాసనమును బట్టి తెలియుచున్నది. పాశ్చాత్య దేశములలో వలె, దీర్ఘవాయిదాలమీద ఈ కాలమునకూడ రైతులకు అప్పులిచ్చుట చాల మంచిపని.

ఆంధ్రుల రాజ్యకాలములో మత సంఘములు, పౌరసభలు (Corporations) కలవని 'భట్టిప్రోలు శాసనములు' తెల్పుచున్నవి. పౌరసభలు సామాజక శ్రేయస్సుకోరుచు

పౌరజనోపకార్యములు జరుపుకొను చుండెను. ధర్మకార్య నిర్వాహక సంఘములోని పౌరసభలోని సభ్యుల పేర్లు యీ శాసనములలో కాన్పించుచున్నవి. అనేకచోట్ల వర్తకసభల పేర్లుకలవు. నేతగాండ్రకు, ధాన్యకశ్రేణులకు, నూనె తయారు చేయువారలకు వేరు వేరు వర్తక సభలు కలవు. ఈ సభలకు క్రమమైన ఏర్పాట్లు, నిబంధనలు కలవు. ప్రజలు తమ సొమ్మును యీ సభలవద్ద దాచుకొనుచుండిరి. వారు దీర్ఘ వాయిదాలమీద ఆ ద్రవ్యమును వడ్డీకిచ్చుచుండిరి. వడ్డీ నూటికి 5 మొదలు $7\frac{1}{2}$ వరకుండెను. ఈ సభలద్వారా వారు స్వపరిపాలన ననుభవించుచుండిరి. భట్టిప్రోలు శాసనములోని నిగమసభ కాక వృషభదత్తుని నాసిక శాసనములో గోవర్ధనములోని నిగమసభ పేర్కొనబడినది. రాజులు రాజ్యపాలనము చేయుటకీ సభలు హెచ్చుగా తోడ్పడు చుండెను. చాల కాలమువరకు గ్రామ పాలనము ప్రజల స్వాధీనములో నుండెను. ఏ రాజులు మారినను గ్రామపాలనము మాత్రము చెక్కుచెదరక అట్లే నిలచెను. అనేకచోట్ల ప్రజలు అరణ్యములు ఛేదించి గ్రామములు పట్టణములు నిర్మించుకొనిరి; చక్కని బాట లేర్పరచుకొనిరి; బాటల కిరుప్రక్కల వృక్షములు నాటి బాటసారులకు విశ్రాంతి గృహము లేర్పరచిరి; సెలయేళ్ల కానకట్టలుకట్టి తటాకములు నిర్మించి, వానినుంచి పంటకాలువలు త్రవ్వించి కృషీవలురకు అనేకవిధములైన జలాధారములు కల్పించిరి; ఉత్పత్తి నధికముచేసిరి. ఆరోగ్యాభివృద్ధిగాంచి దీర్ఘకాలము జీవించిరి. బౌద్ధధర్మ అనుయాయులు అనేక ధర్మ వైద్యశాలల నేర్పరచిరి.

# గ్రీకు లేఖకుల వ్రాతలు

క్రీ. పూ. 326 లో యవనరాజు 'అలెగ్జాండరు' భారతదేశముపైకి దండెత్తివచ్చెను. అతనితో బాటు వచ్చిన గ్రీకులేఖకుడు, చరిత్రకారుడు అగు 'నియార్కసు' వ్రాతను బట్టి, సాముదాయకముగా జనులెల్లరు కలసి భూములలో వ్యవసాయము చేసికొనుచుండిరని, పంటపండించునపుడు ఎవరికి కావలసినది వారు సంవత్సరమునకు సరిపోవు గ్రాసము గైకొనుచుండిరని, మిగత గ్రాసమును, సోమరితనము వృద్ధి గాకుండ, నాశనము చేయుచుండిరని తెలియుచున్నది. [18] వ్యవసాయ రంగములో నిట్టి ఉమ్మడిపని కాన్పించుచున్నది. ఉత్పత్తి, పంపకము మున్నగునవి గలవని, అత్యుత్తమమైన పరిపూర్ణ [19] స్థాయిలోని ఆర్థికవ్యవస్థ నిది సూచిం

---

18. Cambridge history of India — Vol II P. 414.

19. *Vaij Nathpuri*— Ancient greek wri ers P. 100 "There was common workmanship in agriculture. Nearchus (Strabo XV-1-66) mentioned Common workmanship involving the process. of distribution. At the common gathering he said, each took, what was enough to support him for the year. Each had to work before he could get a share. This vindicated economic life of the highest order. In the production, besides land, labour and capital, there was organization and enterprise, since there was common workmanship. Now as there was common production, process of distribution also came into force and more demands, because of exchange and barter, could be satisfied.

చుచున్నదని, ప్రతివాడు తప్పక బనిచేసి తనభాగమును గైకొనవలెనని, ఉమ్మడిగా పంటపండించుటచేత ఉమ్మడి పంపకముగలదని, ఇది శ్లాఘింపతగియున్నదని 'వైద్యనాథపూరి' యను విద్వాంసుడు వ్రాసెను. ఇట్లుండుటచే సోమరితనము దూరమై పోవును.

'కాలినస్' అను భారతీయ యోగి, అలెగ్జాండరు చరిత్రకారుడగు, అనిసిక్రటసుతో నిట్లు చెప్పెను. "పూర్వకాలమున ప్రపంచములో సమృద్ధిగా ధాన్యము, యవలు, ప్రస్తుతము మట్టిలభించునట్లు లభించుచుండెను. ఆకాలపు ఊటలు, నీరు, పాలు, తేనె, మద్యము, తైలములతో బారుచుండెను. కాని పరిపూర్ణముగా లభ్యమగుట చేతను, భోగాధిక్యత చేతను, మనుష్యులు గర్విష్ఠులై అమర్యాదగా సంచరించ సాగిరి. భగవంతుడు దీనిని జూచి, ఆగ్రహావేశపరవశుండై సమస్తమును నాశనముజేసి మనుజునికి కాయకష్టపూరితమగు దుర్భరజీవితమును గల్పించెను. మరల మితభోగము, నిగ్రహములు, యితరసద్గుణములు కల్పించినతర్వాత, మరల మంచిపదార్థముల విస్తారముగా గల్గించసాగెను. మరల మనుష్య స్వభావము మితిమీరిన భోగము, విలాసము, కామాతురత మున్నగు దుర్గుణములకు లోబడుచున్న లక్షణములు గాన్పించుచున్నవి. ఈ చెడులక్షణములు అదృశ్యము కానిచో

మరల పూర్వపు హీనస్థితికి పోవలసివచ్చునను భయంబు వెల్లుగా గల్గుచున్నది.'' [20]

కనుక మనుజునికి గర్వకారణమగు భాగ్యభోగ్యముల తగ్గించి కాయకష్టజీవితమును గల్గించవలెనని భగవంతు డుద్దేశించినట్లు 'కల్యాణయోగి' చెప్పెను. అధికాహారోత్పత్తి చేయుటకు నేటి సామాజకపథకములలో కాయకష్టము చేయుట గౌరవలక్షణముగా జేయబడినది. అది న్యూనత యని ఎవరు తలంచకుండ పనిచేసినచో, స్వయంపోషక గ్రామ వ్యవస్థను నెలకొల్పగలము. ఒక ఆంగ్లేయ లేఖకుడు, ప్రతి చోట మనుజులు మేధస్సుకు బదులు కాళ్ళుచేతుల నుపయోగించుచున్నారని వ్రాసెను. ("Every where people are using their hands and feet instead of their heads, trying to substitute muscle for brain) సమాజపథకములలో మేధస్సుతోబాటు కాళ్లుచేతుల నుపయోగించవలసిన అవసరము గల్గుచున్నది. సంఘమునకు బంగారు సూత్రమైన (Each for all) 'ప్రతి ఒక్కటి అందరికి' అనునది అమలులోనికి వచ్చును.

---

20. *J. W. Mc Crindle :—* Ancient India as described by Megasthenes and Arrian - P 126. "*F*ormerly there was abundance of corn and barley in the world, as there is now of dust; fountains then flowed with water, milk, honey, wine and oil, but repletion and luxury made men turn proud and insolent. Zeus, indignant at this, destroyed all and assigned to man a life of toil. When temperence and other virtues in consequence again abounded, then good things again abounded. But at present the conditions of mankind tend to satiety and wontonness, there is cause to fear lest the existing state of things should disappear".

# చైనీయ లేఖకుల వ్రాతలు

క్రీ. శ. 4 వ శతాబ్దములో మన దేశమునకు వచ్చిన చైనీయలేఖకుడు భారతీయ సామాజిక జీవనమును గూర్చి వ్రాయుచు అనేకచోట్ల వైశ్యకుటుంబములలోని ముఖ్యులు ధర్మములు చేయుటకు, మందులిచ్చుటకు ధర్మశాలల నేర్పరచిరని వ్రాసెను[21]. అశోకుని ధర్మవైద్యశాలలు జగద్విదితము. పాహియాను పాటలీపుత్రములో ఒక పశువైద్యశాలను గాంచెను. అచ్చటనేక ధర్మవైద్యశాలలలో మందులు ఆహారము ఉచితముగా నిచ్చుచుండిరి. వైద్యశాలకగు ఖర్చులు ఉదారులు శ్రీమంతులునగు ప్రజలే భరించుచుండిరి. ఇది యొక సామాజిక పథకము. ఈ ధర్మ వైద్యశాలలకు భాగ్యవంతులు ద్రవ్యమును, బీదలు కాయకష్టరూపములో శ్రమదానమును జేసి యుండవచ్చును. బౌద్ధధర్మ ప్రభావమే దీనికి కారణము. ప్రపంచములోని యేయితర ప్రాంతములోను ఆకాలములో నిట్టి ధర్మ వైద్యశాలలు కలవాయని 'స్మిత్' అను చరిత్రకారుడు తన ఆశ్చర్యమును గనపరచెను. 'పాహియాను' భారత దేశములోని ఉత్పత్తిని గూర్చి వ్రాయుచు ఇట్లు ఉల్లేఖించెను. "దేశము చాల ఉత్పత్తి చేయునట్టిది. ప్రజలు చాల అభివృద్ధిలో నుండిరి.

---

21. *James Legge:*— Travels of Pahiyan: "The heads of Vysya families establish houses for dispensing charity and medicines."

విదేశీయు లిచ్చటికి వచ్చినప్పుడు వారిని చక్కగా ఆదరించి వారికి కావలసిన వస్తుసంచయములనొసంగు చుండిరి."[22]

క్రీ. శ. 7 వ శతాబ్దములో వచ్చిన 'హూనుత్సాంగు' అను మరియొక చైనీయ లేఖకుడు, "చెక్కనుండి మధురకు పోవుచు ఈ భాగములో నిరుపేదలకు, అనాధలకు అనేకము లైన పుణ్యశాలలు లేక ఉచిత విశ్రాంతి మందిరములు కల వని, యీ గృహములలో మందులు, ఆహారము పంచిపెట్ట బడు చుండెనని ప్రయాణీకులకు కావలసిన శారీరక అవసర ములు తీర్చబడు చుండెనని వారికి యే విధమైన అసౌకర్యము కలుగుచుండుట లేదని" వ్రాసెను.[23] అనాధ మందిరములు మున్నగునవి ధర్మార్థమై ప్రజలేర్పాటు చేయుచుండిరని తెలియుచున్నది.

'హూనుత్సాంగు' జీవితకర్త హ్యూలీ అను చైనీయ లేఖకుడు యిట్లు వ్రాసెను. "సింహాళరాజు చనిపోయినప్పుడు అచ్చట కరువువచ్చెను. దేశములో అరాజకము గల్గెను. 'బోధి మేఘేశ్వర, అభయదంష్ట్రి' అను భిక్షువులు 300 మంది భిక్షువులతో గలసి యీ దేశమునకు వచ్చిరి. వారిట్లు చెప్పిరి.

---

22. *Ibid*— "The country is very productive and the people are very prosperous and happy beyond comparison. When people of other countries come to it, they are exceedingly attentive to them all and supply them what they need."

23. *Thomas Watters* — On Yuan Chwang's travels in India. Vol I - P. 287 — "On from the country there were numerous Punyasalas or free rest houses for the relief of the needy and distressed. At these houses medicines and food were distributed and so travellers having their bodily wants supplied, did not experience inconvenience."

"మేము జంబూద్వీపము ఆహారసమృద్ధి దేశమని శాంతి భద్రతలతో అల్లరులు లేకుండా ఉన్నదని వినియుంటిమి."[24] దీనినిబట్టి భారత దేశము ఉత్పత్తిలో స్వయంపోషక మైన దియే కాకుండా కరువుకాటకాదులు వచ్చినప్పుడు యితర దేశీయులు మన దేశమునకు వచ్చినచో వారికిగూడ సమృద్ధిగా భోజన పదార్థాదుల నొసంగుచున్నట్లు తెలియవచ్చుచున్నది. (Yuan chwang - "Among the products of the ground, rice and corn are most plentiful.)

రాజతరంగణిలో కల్హనుని వ్రాతలు:- కాశ్మీర రాజైన అవంతివర్మ కాలములో కరువు వచ్చుటచేత ఒక ఖరే బియ్యపు వెల 1050 దీనారములుండెను. 'సుయ్య' అను యింజనీయరు యిట్లుచెప్పెను. "నా కొక పథకమున్నది. కాని ద్రవ్యసాధనములు లేకుండ నేనేమిచేయగలను?"[25] "సుయ్య" వితస్థినది కడ్డముగా ప్రజలసహాయముతో ఒక రాతి కట్టడ మును నదికడ్డముగా కట్టించెను. అది నిర్మించుటచేత వారము దినములు నీరు ప్రవహించలేదు. అంతయు పూర్తిచేసి డాము తెరచెను. తర్వాత 'వితస్థ'నుండి క్రొత్తకాల్వలు త్రవ్వించి 7 యోజనముల వరకురాతి కట్టడములు కట్టి మహాపద్మ సరసులోని నీటిని అదుపులోనికి తెచ్చెను. పంటలధికముగా పండి ఖరే బియ్యమువిలువ 200 దీనారముల

24. *Beal* — (Hueli) Life of Yuan chwang— P. 139. "We heard that Jambudvipa possessed abundance of food and was at peace and settled").

25. *R. S. Pandit* — Kalhana's Rajatharangini — "I have a plan, but, without resources, what can I do?"

నుండి 36 దీనారములకు తగ్గెను. [26] 'సుయ్య' ఏర్పరచిన యీ ఆనకట్ట గొప్ప సామాజిక పథకముగా గాన్పించు చున్నది. 'సుయ్య' యొక్క ఈ పథకమునకు, కాశ్మీరీయులు ధన, వస్తు, కాయకష్ట రూపములో సహాయపడి ఉండ వచ్చును.

## తమిళ వాఙ్మయము

'తిరుక్కురళ్' అను తమిళ గ్రంథములోను 'మహా వంశ'మను సింహళదేశ చరిత్రలోను క్రీ. శ. 100 వ సంవత్స రమునాటి కరికాళ చోళుని చరిత్రము కాన్పించుచున్నది. పరాక్రమోపేతుడైన యీ రాజు త్రిలోచన పల్లవునోడించి అతనిచేత మట్టితట్టలు మోయించి, కావేరికి ఆనకట్టలు కట్టించెను. సింహళముపై దండెత్తి 12000 మందిని ఖైదీలుగా దెచ్చి కావేరి నదికి 100 మైళ్ల పొడవున ఆనకట్ట కట్టించి అనేక కాలువలు త్రవ్వించి వ్యవసాయాభివృద్ధిచేసి, వరద బాధలేకుండ జేసెను. మనుష్యుల సహాయముతో అడవులను నరికి గ్రామములను, పట్టణములను, కోటలను వృద్ధిచేసెను. చెరువులు త్రవ్వించి వేలకొలది యకరములు సాగులోనికి దెచ్చెను. ఇతడు జేసిన అనేక ప్రజోపయోగ కార్యములు అనేక గ్రామకైఫీయతులలో వర్ణించబడినవి. 'పొరునరప్పా ప్పాడి' అను తమిళ గ్రంథమును బట్టి ఆకాలపు ప్రజలు

---

26. *R. S. Pandit* — (Tr) Kalhana's Rajatharangini. P. 167. "When formerly during times of great abundance, the purchase price of a Khari of rice had been 200 Dinaras since its creation in that same realm of Kashmir since his time, O wonder ! the purchase of rice came to be 36 Dinaras."

పండిన పంటను కొడవళ్లతో కోసి, కొండలవలె నిల్వజేసి, వడ్ల గాదెలలో పోసి, వేలకొలది కలానుల మంచిధాన్యమును ఉత్పత్తి చేయుచుండిరని తెలియవచ్చుచున్నది.[27] వీరందరు కలిసి పనిజేయుటచేత యిదియొక సామాజక పధకమువలె కాన్పించుచున్నది. 'ఖుఫురాజుకు' గొప్ప పిరమిడ్ కట్టుటకు ఒక లక్షమందికి ఈజిప్టులో 20 ఏండ్లు పట్టినదని, గ్రీకులేఖకుడు 'హిరోడోటస్' వ్రాసిన విషయము పై సందర్భములో జ్ఞప్తికి వచ్చుచున్నది.

## 3. సామాజక పధకములవలన లాభములు

సామాజక పధకములవలన పాఠశాలా విద్యార్థులకు ఈ క్రిందిలాభములు గల్గునని డా. జీవనాయకము మున్నగు విద్వాంసులు వ్రాసినారు. వాని నీక్రింద వ్రాయుచున్నాను. (1) విద్యార్థులకు చురుకుదనము హెచ్చును. కార్యములు స్వయముగా చేయుచుండుటచేత అనుభవము హెచ్చి సమస్తవిషయముల నేర్చుకొందురు. (2) సమాజములో కలసి మెలసి యుండుట నేర్చుకొందురు. (3) పనియందు అభిరుచి కల్గును. దాని నెట్లు పూర్తిచేయవలెనా యని సంతతము ఆలోచించుచు మాటాడుచుందురు. (4) కార్యాంతములో దానినుంచి వచ్చు సూత్రముల కనిపెట్టి సూత్రనిర్మాత లగుదురు. (5) జ్ఞానమునకు శీలమునకు గల సన్నిహితసంబంధ

---

27. Porunarappuppadi "Bending their backs, they reaped the paddy with the edges of their sickles, made heaps of rice sheeves as high as hills, daily starched the paddy in never decreasing ricks which looked like hills, poured it fully in barns, which stood close to each other for every value of land enclosed by dikes, produced a thousand kalans of good paddy."

మును తెలిసికొందురు. (6) హేతుబద్ధమైన నడకవలన ఆలోచన వృద్ధిగాంచును. (7) ప్రతివిద్యార్థి కార్యదీక్షలో నిమగ్నుడై సక్రమమైన తర్ఫీదునొందును. (8) జ్ఞానము వ్యర్థముకాకుండ ఆచరణవలన అభివృద్ధినొందును. (9) నిజమైన అనుభవమువలన పాఠశాలలోని కళలను, శిల్పములను అతిశీఘ్రముగా నేర్చుకొనును. (10) వాస్తవిక పరిస్థితిలో జ్ఞానము గల్గినప్పుడు అది అభివృద్ధిజెంది వాస్తవిక జీవితమునకు దోహదమొసంగును.

విద్యార్థులకు గల్గిన పై లాభములే సామాజకపథకములవలన ప్రజలకుగూడ కల్గి దేశాభివృద్ధికి తోడ్పడును. 'మానవసేవయే మాధవసేవ' అను ధర్మమును గుర్తెరిగి గొప్పజాతిని గొప్పదేశమును సృష్టించగల్గుదురు. ఈ నూత్న భావములుకల్గినప్పుడే నవ్యభారతనిర్మాణమగును. 'ఎమర్సన్' చెప్పినట్లుగా ఒక జాతిని గొప్పదిగాను, బలమైనదిగను చేయవలెనన్న మనుష్యులే ప్రధానముగాని బంగారము ప్రధానము గాదు అను వచనము సామాజక పథకములలో పనిజేయు మనుష్యుల భావములవలన సత్యమగును." [28] అందుచేత శాస్త్రవేత్తలు కనిపెట్టిన విషయములు, సూత్రముల జ్ఞానము హేతుబద్ధమైన నడకలోనికి దింపుచు, అట్టిజ్ఞానము ఒక వ్యక్తికేకాక సమాజమునకంతటికి లాభదాయకమైయుండవలెనని ఆంగ్లేయ విద్యాశాఖబోర్డువారు ఒక కరపత్ర

---

28. *R. W. Emerson*— A nation's strength
"Not gold, but only men, can make
A people great and strong—"

మును ముద్రించిరి. (Board of education pamphlet – "A knowledge of the facts and principles gained by scientific workers should result in a more rational mode of life: not only is such knowledge of benefit to the individual, but to the community as a whole.) సామాజకపథకములవలన ప్రతి సమాజములోని వ్యక్తి కట్టి శాస్త్రజన్యజ్ఞానముగలిగి పురోభివృద్ధి గాంచుగాత! జనైక్యము నశించుగాత! స్వార్థము వీడిపోవుగాత!



జ్యోతి ప్రెస్, తెనాలి